శ్రీ

పరమేశ్వరార్పణమస్తు.








మచిలీబందరు ఛత్రపుర వరమున వెలసియుండు

శ్రీ భ్రమరాంబా మల్లిఖార్జునుల

# గీతానుతికదంబము.

ఇది శ్రీ ఉమామహేశ్వర ప్రసాదుండును కాశ్య
పసగోత్ర కులోద్భవుండును ఆపస్తంభ సూత్రుం
డు చిట్టా లక్ష్మినారాయణ పుత్రుండునగు
వేంకటరామయ్య విరచితము.

మచిలీపట్టణములోనున్న ,, తెలుగు లా జర్నల్"
ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1915 సం॥

ఓం!

శ్రీ శారదాయనమః

శ్రీ గణేశాయనమః

# కీర్తనలు.

రాగము - కాంభోజి - తాళము - అట.

ఇభరాజవదనా - పార్వతీ పరమేశనందనా । పరమేశ నందనా - భక్తావి చందనా ॥ పల్లవి ॥

ఫాలాక్షుసుతుడని - నిన్ను నేను పూజజేసీతి । నిను పూజజేసీతి - నినుకొనియాడితి॥ ఇభ ॥

శరణాన్న సుజనుల - మరువక రక్షించువాడవు । రక్షించువాడవు - కాపాడువాడవు॥ ఇభ ॥

ధరఛత్రిపురవరమున వేంకటరాముని । ఏలేటివాడవు - పాలించువాడవు॥ ఇభ ॥

శ్రీ శంకరాయైనమః

రాగము - కాంభోజి - తాళము - అట.

పాలించరా పార్వతీశ । పాలించు శ్రీ ఛత్రిపురము మల్లేశ॥ పాలి ॥ పల్లవి ॥

భక్తవత్సలుడవని ప్రబలిన దేవ । భటుని సన్నేలుటకు పరిశీలన సేయవు॥ పాలి ॥

కఠినాత్ముడనని కోపముంచక । కారుణ్య మతినన్ను కాపాడవ దేర॥ పాలి ॥

పాలముంచిననీవే నీళ్లముంచిననీవే । పలచన సేయక పాలించు దేవ॥ పాలి ॥

పలుమారు నినునేను బ్రస్తుతిజేసేద । పాప్రైదాపై యుండు పాపవినాశన॥ పాలి ॥

చిట్టా వేంకటరామదాసా ప్రాణేశ । జలజనయన నా జన్మ మీడేర్చుమీ॥ పాలి॥

—♦ మంగళహారతి. ♦—

రాగము - పాదరామక్రియం - తాళము - త్రిశ్రగతి.

బాలచంద్ర భూషణాయ । బాలసూర్య భాసురాయ ।
కాలగర్వ భంజనాయ - కలితమంగళం ॥

పార్వతీ మనోహరాయ । పాపపుంజ నాశనాయ ।
పద్మనాభసాయకాయ - భవ్య మంగళం ॥

సాధుహృదయ రంజితాయ । సారసాభనేత్రాయ ।
సామగాన లోలాయ - సత్య మంగళం ॥

నీలకంఠ శోభితాయ । నిర్వికార రూపాయ । నిగ
మాంత వేద్యాయ - నిత్య మంగళం ॥

సర్వలోక పూజితాయ । సర్వలోక పాలనాయ । సచ్చి
దానందాయ - సత్యమంగళం ॥

రజితగిరి నివేశాయ । విజితశత్రు సంచయాయ ।
గజచర్మ ధారణాయ - కలిత మంగళం ॥

చారుగిరి నివేశాయ । చారుమందహాసాయ । హీర
హార శోభితాయ - నిత్య మంగళం॥

త్రిపుర నివాసాయ । చిత్రరూపశోభితాయ । చిత్ర
జుశిక్షితాయ - దివ్యమంగళం ॥

సంకటాప నోదనాయ । శంకరాభిధానాయ । వేంకట
రామ పాలనాయ - విజయ మంగళం ॥

శ్రీ అంబాయైనమః

— మేలుకొలుపు. —

రాగము – భూపాళం॥ తాళము – ఆట.

అంబా మేలుకో । బాలమేలుకో॥ పల్లవి ॥

మేలుకో శ్రీ త్రిపురమున విలసిల్లు । మల్లేశ్వరు దేవి
మేలుకో॥ అంబా ॥ పల్లవి ॥

మేలుకో మాగధ గాయకులు వచ్చిరి । మహిషాసుర
మర్దని మేలుకో మహిమీదనీవర నామస్మరణకు
మంచి । మాన్యులొచ్చున్నారు మేలుకో॥ అంబా ॥
మల్లెలు మొల్లలు మంచి సంపెంగలు । మునులు దె
చ్చున్నారు మేలుకో । వాలాయముగ వారి వరగుణా
నుభవము । వరసతో పొందుటకు మేలుకో॥ అంబా ॥
మేలుకో శ్రీ యాదిశక్తివి వైయున్న । మల్లిఖార్జుని
సతి మేలుకో । కంజముమించు మీపాదసేవకు వేం ।
కట రాముడొచ్చెను మేలుకో॥ అంబా॥

## —♦ కీర్తన. ♦—

రాగము - సౌరాష్ట్రి - తాళము - ఏక.

నినునమ్మి కున్నవాడను ఓఓ బాల ఓఓ జనని । నిను
నమ్మికున్నవాడను॥ పల్లవి ॥
నినునమ్మికున్నవాడ । ననుపరుల జేరనియక । మన్న
నజేశికావుమీ॥ ఓఓ బాల ॥
మానాభిమానములకు । మానుగనే లోనునైతి ।
దీనతనొందనేరనే॥ ఓఓ బాల ॥
సంసార సాగరమున । హింసల బడితిచాల । వేసట
దీర్చి బ్రోవుమీ॥ ఓఓ బాల ॥

రంగుగ దాసుడైన । వేంకటరామునేలి । పొంకము
తో ప్రేమయుంచుమి॥ ఓఓ బాల ॥

## లాలిపాటలు — నక్షత్రమాలిక.

రాగము - ఆనందభైరవి - తాళము - ఖండగతి.

1. లాలిశ్రీ యంబలాలి । లలితాంబలాలిశ్రీ బాలలాలి ।
లాలిశ్రీ చండిలాలి । లలినొప్పు శాంకరీ గౌరిలాలి॥
పల్లవి ॥

2. శ్రీవెలయుచు హిమగిరిని । గరిమతోక మలమధ్య
మందు । బాలగా జన్మించిన । గిరిరాజు భాగ్యమెట్టి
దో చూడరే ॥ లాలి ॥

3. పుత్రినికోరి మదిని । ఆ రాజు ఏకదృష్టినివేడగా । అ
దేవి అపుడు మెచ్చి । ధీతితో పార్వతిగ వెలసెనటరే ॥

4. అప్పుడారాజుజూచి । ఒప్పుగా సకల సంపదలు దెచ్చి ।
దేవాంగనలకునొసగి । వారిని సకలవిధముల పొగిడెను॥

5. ప్రీతితో వారందరు । బిడ్డను బంగారు తొట్టెలోను ।
వాలాయముగ పొంగుచు । వూచిరి మాయమ్మ య
నుచు పొంగ॥

6. ఓబాలయోగీశ్వరా । మా బాధలన్నియు నేటితోను ।
చాలుగా బాపుకొరకు । జగమున నవతరించిన జననివి॥

7. ఆదిశక్తి రూపివే । ఓతల్లి చిన్మయాకారి గదవే ।
మాపాలి దేవిగదవే । ఓబాల చిచ్చస్వరూపిగదవే ॥

8. ఈ లోకములయందున । యవరికి తెలియని స్థితివిగదవే।
ఎవరు నీమహాత్యము । తెలుసుకోలేనట్టి పదవిగదవే॥

9. ఈ విధమువారందరు । నాబాల స్థితిఅంత వేడగాను ।
అదేవి అపుడుమెచ్చి । ప్రీతితోవారికి నభయమిచ్చె॥

10. సొంపుగా వారివరుస । యింపుగా కాచిరక్షించుకొరకు।
ఆ సరోవరమునందు । ఆసతో కూర్చుండి తపముజేసె ॥

11. దక్షిణామూర్తి పేర । దీక్షతో పశుపతి తపముజేసె ।
ఆ తపము హెచ్చి హెచ్చి । ఆయూధిలోకములు నిం
డియుండె ॥

12. దానికితాళలేక । దేవతలు హృదయమున భీతిజెంది ।
లోకకర్తనగబరగు । వాగ్దేవిప్రియునకప్పుడు మ్రొక్కిరి॥

13. ఓధాత కావవయ్యా । యీధాటికిప్పుడే మేమందుము?
మాబాధ జూచినీవు । యీబాధ తప్పించుమనివేడను॥

14. సురజ్యేష్టు డంతజూచి । దేవతలభయమును కావలేక ।
వారికిసమ్మతిగను । యీలాగునెమ్మదిగఁదెలియబలికె॥

15. దేవతులారమనము । యీలాటిఘోరతపమును నెన్నడు
చూచివిన్నదియులేదు । చూడగా చోద్యమయ్యెను
బాగుగ॥

16. మనమెల్ల నొకసరణిగ । మానుగపార్వతి కడకుజేరి ।
వేడుకలు ఉప్పొంగగ । వాటముగ నాదేవిమెప్పింతము॥

17. అనుచు బలుకుచు వారలు । మానుగ యక్షకిన్నరుల
తోను । ఆదేవి కడకుజేరి । ప్రీతితో నుతులుజేసిరి
యంతట॥

18. దేవాది దేవిసుమ్మి । ఓ విజయనిర్మలాకారి సుమ్మి ।
బాలరూపముపొందిన । శ్రీలలితాంబికా దేవిగదవే ॥

19. వేదాంతవేదినుమ్మి । ఓదేవి ఆవిజయలక్ష్మిసుమ్మి ।
దైత్యహంతిశ్రీణిగ బరగు । భూతేశురాణివై యొప్పె
నటవే॥

20. మహాలక్ష్మి యనగవచ్చు । ఓఅంబమాలిని యనగ
వచ్చు । కులసుందరిపేరను । వరుసగా జగములు
నిండియుంటి ॥

21. అమ్మమ్మనీవెకావె । యింపుతో సకలరాక్షసుల దునిమి । వాసిమీరిన ప్రేమతో । జేసితివి సకల లోకములుబాగ ॥

22. ఇటులనుచు బహువిధముల । వాటముగ నాదేవి మెప్పించిరి । వాసిగా నాదేవి । ధ్యానతో బహు వందనములు జేశే ॥

23. ఓదేవి యిపుడునీవు । ప్రీతితో మామనవి మనము నుంచి । సంతోష ముప్పొంగను । భూతేశురాణివై వెలయవమ్మ

24. ఈరీతివారందరు । వారిని నిద్దరిని నొకటిజేసి । ఆతపముబాధతీరి । ఆరూఢి సకల సుఖములనొందిరి ॥

25. ఈసచ్చరిత్రిమును । ధ్యానతో శ్రవణంబు జేసితేను । ఆశమీరినప్రేమతో । వాసిగా పఠనంబు జేసితేను ॥

26. భత్రిపురమునవెలశియు । పాలించు మల్లేశ్వరుని దేవి । వేంకటరామునేలి । వారికి యిష్టసంపద లొసగును ॥

27. ఇహపరములు రెండును । మహిమతో కరతలామ లకముగను । రంగుమీరగ నొందగ । పొంకముతో ముక్తి కన్యనుకనుదురు ॥ లాలి ॥

## —♦ మంగళహారతి. ♦—

రాగము - సురట - తాళము - అట.

దక్షుని గృహమున । తనయవైజనియించి । దాక్షాయణిపేర తగనుబెంపొంది । దక్షాధ్వరము వి । ధ్వంసముజేసి యా । దక్షునిశాపము తప్పించుజననీ ॥ మంగళం ॥ మంగళం । పార్వతినీకు । అంబానీకు । మంగళం । మంగళం । పల్లవి ॥

పర్వతమునబుట్టి పశుపతివరియించి । పరగబ్రహ్మాదుల పాలనజేసి । సర్వలోకములు సరణిగనేలిన । జగదంబ పాపనాశని శర్వాణీ॥ మంగళం ॥ మంగళం ॥

సకలభువనములు । సర్వావస్థలనొంది ప్రకటముగా నిన్ను బ్రస్తుతిజేయ । అకలంక దయజెలువార వారల బ్రోచి । వికటదైత్యులదునిమి । వెలసినగౌరీ॥ మంగళం । మంగళం । అంబానీకు మంగళం । మంగళం ॥

కరుణతో భక్తులకడ తేర్చి-యిలలోన । భరితప్రఖ్యాతివి భాసిల్లగాను । కరమొప్ప చిట్టా వేంకటరామదాసుని । యిరవుగ బ్రోచిన యిష్టకామేశ్వరీ ॥ మంగళం । మంగళం । అంబానీకుమంగళం । మంగళం॥

## మంగళహారతి.

రాగము - కాపి - తాళము - త్రిశ్రగతి.

1. హారతి జయహారతి మంగళ । హారతివ్వరే ।
ధీరతతో వెలుగుబాలా । త్రిపురసుందరికి ॥ పల్లవి ॥

2. నాదబిందుకళలయందు । నాట్యమాడును ।
ధీటితో జవెలుగుచుండె । దివ్యసుందరికి ॥ హా ॥

3. రంగుగ శ్రీ చక్రమున । నాటలాడును ।
పొంకముతో సంపదలొసగె । పువ్వుబోణికి ॥ హా ॥

4. కోటిసూర్య ప్రభలవెలిగె । కోమలాంగికి ।
నీటుమీర భక్తులగాచె । నీలవేణికి ॥ హా ॥

5. శిష్టజనులపాలన జేసే । సృష్టికర్తకును ।
ఇష్టపదవి నొసగిబ్రోచె । ఇందువదనకు ॥ హా ॥

6. ఛత్రిపురము నందు వెలసిన । శర్వమంగళకు ।
చేరి దాసులబ్రోచెటి । శరదిందువదనకు ॥ హా ॥

7. చిట్టా వేంకటరామయ్యనేలు । చంద్రవదనకు ।
బోటులార గుములుగూడి । ప్రీతిహెచ్చగను ॥ హా ॥

గద్య॥ ఇది శ్రీ ఉమామహేశ్వర ప్రసాదుండును కాశ్యపస
గోత్రుండు లోద్భవుండును ఆపస్తంభ సూత్రుండునగు
చిట్టా వేంకటరామయ్యా విరచితము. సమాప్తము.

# శారదా స్వబోధిని గ్రంథావళి.

1. 26 అధ్యాయములు విచిత్రములగు సాధకములు ఉదాహరణములు కలిగియుండు తెలుగు ప్రైమరి అంక గణితము.

తపాల ఖర్చులుగాక వెల రు. 0—4—0.

2. 12 అధ్యాయములు విచిత్రములగు సాధకములు ఉదాహరణములు పద్యములు వర్గమూలములు మొదలగునవి కలిగియుండు తెలుగు సర్వేమెన్యుయలు.

తపాల ఖర్చులుగాక రు. వెల 0—8—0.

వలయువారు:-

చిట్టా వేంకటరామయ్యగారు,

రిటైర్డు సబ్ యింజినీరు.

గొడుగుపేట,

మచిలీపట్టణము.

